శ్రీరస్తు. శుభమస్తు. అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబావిజయతేతరాం.

# హనుమత్శతకము

శతావధాని

భారతుల వీరరాఘవ శాస్త్రి విరచితము.

బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1932.

శ్రీరస్తు.

# శాంకర్యష్టకం.

---

మ॥ శ్రీవాణీగిరిజాస్త్వదీయ్య సుకళాజాతా స్త్వదాజ్ఞా...
కంజాతాసన శౌరి శంకర ముఖాదిత్యాః పరం విద్యతే
త్వల్లీలాజగతశ్చ తేన భవతీ మిథ్యా ప్రపంచం వినా
స్తామిత్వామితి భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥

౨ ప్రాజ్ఞా నామ వివేకి నామనుగతం సౌఖ్యేచ దుఃఖేపివా
నాస్త్యన్యా శరణం త్వదీయచరణం సుశ్రీయశస్కారణం
మన్యేహం ధ్రువమిత్యఘౌఘ హరణం వాక్కాయ హృత్కర్మభిః
ధన్యం మాం కురు భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥

3 షట్కోణేనవచిద్య బీజరుచిరం యంత్రే లిఖిత్వాపరే
స్వాంత్రం యోజ్య ప్రబోధ్యదాత్మని శరత్కాలే సదాత్వాం ననూ
ప్రత్యక్షాభవసిప్సితార్థ ఫలదానే తస్య ధన్యోభవేత్
కోభక్తస్తవ భక్తలోక కృతపూజా స్వీకరి శాంకరీ॥

4 త్వత్పూజావిముఖా వివేకరహితాః జన్మాంతరే యేసతీ
వాసోగ్రాస మనీషితా చతురతాదూరాః వసంత్యద్యతే
పూజ్యా రాజ్యసుఖాప్తవైభవయుతాః విద్యానవద్యోన్నతాః
త్వద్భక్తాః ఖలు భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥

5 ప్రస్తారే రుచిరే గతేసతి నియోజ్యత్ జ్యోతిషి స్వంకరం
యఃకూపేస్థలతిస్మ సోర్చతిభవత్యాః దైవమన్యం ముదా
మాతస్త్వద్విలసత్ప్రభావ మసమర్థ జ్ఞాతుమస్మద్వివే
కాధిక్యం కురు భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥

6 భక్తానాం హరిచందనం సుఖకర స్వర్లోక సోపాన స
న్నిశ్రేణీం దురితాపనోద సదుపాధిం సర్వసంపత్కరం
దైత్యారీశపితా మహాదిసురగీతం తే చరిత్రం శృణోత్
సోధన్యః ఖలు భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥
7 శిష్టానాం పరిపాలనాయ హరణాయామేయ పాపాత్మనాం
భూభారోత్తరణాయ భువ్యవతరిత్వా సర్వలోకోన్నత
క్షేమం ధర్మపదం కరోషియదిచే న్నోలోకపూజ్యంభవే
త్సర్వం త్వం ఖలు భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥
8 సంసారాఖ్య సరిత్వతౌ సుఖితశూన్యే నిత్యదుఃఖార్తితాః
మజ్జంత్యబ్జభవాది నిర్జర జగజ్జేగీయమానా త్వదీ
యామేయాంఘ్రిమహోత్పలార్చన విధిం త్యక్త్వా వివేకాహితా
మాతస్సాత్త్విక భక్తలోక కృతపూజా స్వీకరీ శాంకరీ॥

౧ శాంకర్యష్టక మిష్ట కామ్య ఫలదం భక్త్యాపఠేద్యస్సదా
విద్యాకీర్త్య నవద్య భారతుల సద్వంశామృతాంభోధినా
ధాంభోజాహిత వీరరాఘవ కవిప్రోక్తం సుధీస్స్యాదిదం
శ్రీదేవ్యాః కృపయా ప్రభావిభవ మోక్షార్థైః కృతార్థశ్చసః॥

భారతుల వీరరాఘవ శాస్త్రిణా

విరచిత మిత్యష్టకం శాంకర్యాః

---

శ్రీ గ్రంథకర్త.

సీ॥ సరసహృద్య సుహృద్య సంగీత సాహితీ ధనుడు
గుర్వయశాస్త్రి తండ్రి విమల
చారిత్ర మంగళాస్పద దివ్యసుగుణామ తల్లి
నరసమ సాధ్వి తల్లి వైద్య
సంస్కృతాంధ్రజ్ఞాతా శాలి జన్నాభొట్ల కోట
య్య మామ సంస్కృత మనీషి
లసదోషదేశి వెల్లంకి వేంకట సుబ్రహ్మణ్య
శాస్త్రి నిర్వ్యాజ హృదయ
గీ॥ సరసిజాడు వీరరాఘవశాస్త్రి యేను వీరభ
ద్రేశ్వరి సుగుణ విదిత పత్ని
కలితకవితా పలాసిని వలపుసాని ప్రథిత
మా నింటిపేరు భారతులవారు॥

శ్రీరస్తు.

# శ్రీహనుమచ్ఛతకము.

---

శా॥ శ్రీవాణీ హిమవత్సుతాధవసునాసీరాది గీర్వాణహృద్
భావాక్రాంత చరిత్రసత్త్వముద భవ్యశ్రీప్రదామేయసి
తావామాప్రియ భక్తవర్య మదిలోధ్యానింతు నిన్నెప్డు ప్రా
పై వేసితుల నన్ను బ్రోవదగు సీతాంబాశ్రితా మారుతీ॥

శా॥ శ్రీరాము న్సుగుణాభిరాము విలసత్సీతామనఃకాము శృం
గారాంభోధనధాము భక్తజనతా కారుణ్యసీమున్ బర
స్ఫారంబై భవదంతరంగమున నిల్పంజేసి తేవండి తేం
ద్రారాధేయ శుభోదయానుగుణ సీతాంబాశ్రితా మారుతీ॥

మ॥ అనువై శంబరవైరి సంగరనియుక్తాంతఃపురస్త్రీల కా
దనక౯ గంటివి కన్నులారగొని సీతాన్వేషణ వ్యాజమే
మని రోషించి బరిగ్రహించితివి ప్రోద్యద్బ్రహ్మచర్యంబు మే
లన కార్వేటి పురీలసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 3

మ॥ ఒకపాదంబల పూర్వపర్వతము నందొక్కండు నస్త్రాద్రి పై
ప్రకటాస్థాకన జేసి సూర్యున కహోరాత్రుల్సమీపించియే
రకమై తొమ్మిది శబ్దశాస్త్రముల నేర్వంజాలితో సేవబా
యక కార్వేటి పురీలసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 4

మ॥ ఇదమిత్థంబను ధర్మపద్ధతిని వహ్నింగప్పి భూమీసుతా
హృదయేశుండతడుండనుండు నిక నాకేమంచు చెట్ల౯ మరిం
పెదగట్లుంగొని సంహరించితివి కవిందైత్యులన్; సత్యమే
యది? కార్వేటి పురీలసత్సదన॥ 5

మ॥ బలిరా యొక్కఁడిరాము డెక్కఁడివివస్వత్సూను డీవీనుహా
త్ములకున్ సఖ్యతనగ్ని సాక్షిగ బ్రియమ్ముంగూర్పఁగా నేడ నీ
విలసద్బుద్ధి బలంబుగాక వేరొకటియే విద్వత్ప్రిగో రత్నమా
యల కాట్రేని పురీలసత్సదన॥ 6

మ॥ వనముం బాడొనరించి రక్కసుల గొంపల్గాల్చి లంకాపురం
బును ఘోషింపఁగ నర్ధరాత్రసమయం బాబాలగోపాల మె
ల్లను గోడాడఁగ జేసివాడవుగ యుల్లాసింతువే ధర్మమే
యని కాట్రేనిపురీలసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 7

మ॥ భవదీయానుపమానదివ్యనుతసత్వంబేమొ ప్రోద్యన్నవీ
న వివస్వంతుని పుట్టినప్పు డొక వర్ణంబైన పండంచు పై
నవలీలం గబళింపఁజూచితివి పహ్వాద్యోంత తేజఃప్రదా
యవై కాట్రేనిపురీలసత్సదన॥ 8

శా॥ లంకాస్థానముకేగి రక్కసుల నిర్లక్ష్యంబునంగాంచి బల్
బింకాల్గొట్టి దశాననాదుల మనోభీతింబొసంగింపవే,
శంకాలేశములేక నొక్కడవు నీస్థైర్యంబ బల్యంబె శౌ
ర్యాంకా మేరుగిరీంద్రధైర్యధర సీతాంబాశ్రితా మారుతీ॥ 9

మ॥ లలితా రామము పెల్లగించితి వదేలా సేతువోయన్న దై
త్యుల ప్రాణంబుల గొంటివొక్కడవు యోధుల్ వారనేకుల్ భవ
ద్బలవత్స్త్రవిహీనశక్తి నుతియింప న్శక్యమానే సుధీ
యల కాంక్షేనిపురీ॥ 10

మ॥ స్థిరసై వాలి ప్రభుత్వమందు ఘనమంత్రిత్వంబు గొన్నాళ్ళు వి
స్తరతం జేసితి వంతలో రఘుపతిందాపై యుసింగొల్పి త
ద్వరునిన్యాపిరి దీయ జేసితివి భూపద్రోహ మార్యాళి బా
యరె కాంక్షేనిపురీ॥ 11

మ॥ అవలీలన్ శతయోజనాయత మపారాంభోధి నిర్భీతి హృ
జ్జనమై దాటితి వల్ప పల్వలమునా ఛాయంబొసంగించి కా
ర్యవిఘాతానుగతాంతరాయములు మాయంజేయుచున్ ధాటి బా
యవు కాటేనిపురీ ॥ 12

మ॥ అకలంకానుపమానదివ్యనుత బ్రహ్మానంద సంధాన భ
వ్యకలాపాంచితి మౌనిరాడ్జపిత హృద్యన్మోక్ష సామ్రాజ్యదా
యక రామస్మరణానుషంగ దయ నాయందుంపుమెల్లప్పుడు బా
యక కాట్రేనిపురీలసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 13

మ॥ సురరాడ్వైరి రథస్థుడంచును ధరస్థుండంచు సౌమిత్రి నా
తురత న్మాపున నెక్కజేసుకొ నసాధ్యుండైన శక్రారి యూ
పిరి దీయించితివౌర యెంతకయిన స్వీకుడవౌ పావనం
హర కాట్రేనిపురీ॥ 14

మ॥ కదనంబందున రామలక్ష్మణుల రాక్షసుల్ బడఁగొట్టినం
గద మూర్ఛిల్లిరి తోకతోడ పెద్దప్రాకారంబు గల్పించి
యందు దగ్గ వారల దాచి కాచితివి నీదోస్సత్వ మింతింతయే
యది కాట్రేనిపురీ॥ 15

మ॥ నశిరేయి న్మయిరావణుండు ధరణీనాథ ద్వయమ్ముం గనం
బడకుండంగ హరించి శక్తిబలిగా బారంగ వెన్వెంట న
ప్పుడనీవేగి దురాత్ము ద్రుంచి గొనవే భూపాలురం గోతిరా
యడ కాట్రేనిపురీ॥ 16

మ॥ శరముల్ శస్త్రములస్త్రజాలము ధనుస్సంబంధమేమున్న ని
వ్వారగా రక్షసగుంపు లయ్యెసురు నీవేపోనుకుంటే భయం
కరుడన్నం బలు కాలకించిన నమోఘుం బీవిధిం బాపసం
హార కాట్రేనిపురీ॥ 17

మ॥ మును వజ్రాయుధ ఘాతకోడి బుడమినమ్మూర్ఛిల్లగా నీవునీ
జనకుండప్పుడు భూతిసంతతికి నిశ్వాసంబు బాధింప దే
వనికాయంబులు నీగినట్టి బలమే భావింతు నీసత్వమా
వని కాట్రేనిపురీ॥ 18

మ॥ మును దివ్యప్రభు లిచ్చినట్టి బలమే ముఖ్యంబుగా కున్న మిం
చిన రాక్షాసుల యింద్రులెల్ల బలె నీజీవానికిం గోడుగో
డని పై పైబడి మొత్తుకుందురె యవార్యంబైన శౌర్యప్రభుం
డని కాట్రేనిపురీ॥ 19

మ॥ కలితాపార బలానుశౌర్య భుజరక్షశ్రేణి సంరక్షితం
బలలంకాపుర మీడ కోతివనగా నల్పుండవీ వేడ దా
నిలయంబంద దహింపుచేడ వినగా నీవెంత సత్వుండవో
యాలకాట్రేనిపురీ॥ 20

మ॥ నిను శ్రీరామ పదారవింద భజనానంద్యప్రభావాత్ము దు
ష్టనిశాచరోన్నత విక్రమాంతకుని విఘ్నం జేసిసేవించి నం
తన నిష్టార్థము లబ్బుటబ్బురమె యూత న్నమ్మితిం బ్రోవుమీ
వని కాక్రేనిపురీ॥ 21

మ॥ జలజాతాసన శౌరిశంకరముఖస్వర్గస్థుల న్నృపతి
వ్రులు పాజ్జేసిన రావణాసురుని నీబాహాబలోద్ఘాతచే
నిలపై మూర్ఛిలజేసినాడవు బలాహీన ప్రభావుండవీ
వల కాక్రేనిపురీ॥ 22

మ॥ రణరంగంబున నేలపైబడిన శ్రీరామాది యోధానుయో
ధనులన్ జీవన దాయకౌషధ మహీధ్రంబవ్వుడే దెచ్చిదో
హానమై యూపిరివోసి లేపితివి సౌఖ్యంబంద నవ్వారి మే
లన కాక్రేగిపురీ॥ 23

మ॥ బలవద్విక్రమ శౌర్యధుర్యుఁడవు దుర్వార ప్రభావుండ వీ
వల నీసాయముగల్గ రామవిజయంబై సెల్లె నెవ్వారు దా
వలమై నీవెపుడుండ నుండ జయభవ్యశ్రీలనార్జింపరో
యల కాంచీపురీ॥ 24

మ॥ గిరిజాజాని మహోజ మీవిధముగా నేసర్వక్షేత్ర మం
దరయంగం భవదీయ రూపముగ నింపై బుట్టి గాకున్న నీ
సరసద్రూపబలాతి శౌర్యములు దుస్సాధ్యంబులే చాపసం
హార కాంచీపురీ॥ 25

మ॥ మునుసాగంధిక పుష్పముంగొనగ తమ్ముండేగు నచ్చోట చూ
గఁనిరోధంబుగ బాఁడి యాబలుని గర్వస్ఫూర్తి బోనార్చి నీ
ఘనతాకారముజూపి ధర్మముల వక్కాణింపవే నాడహో
యని కాంచీపురీ॥ 26

మ॥ జలధిం దాఁటినాఁడు మార్గమునకుం జాఁపై విరోధింప దు
ర్బలు చందంబున లోఁగ నావనిత నీపైరాగ గర్భంబులోఁ
బలికెం దూరి యధోబిలంబున వధింపై బారిపోవే సుధీ
యల కాంచీపురీ॥ 27

మ॥ బలుశూరుండవు శబ్దశాస్త్రవిలసత్పాండిత్యధీయుండ వ
స్ఖలితస్ఫారిత బ్రహ్మచారివిగదా కాంతాజనంబుండగం
బలిమిన్ మ్రాఁకిఁ దీసినాఁడ విది నిర్వార్య ప్రభావంబొకో
యల కాంచీపుర లసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 28

మ॥ ధరణీజాపరిణేతృకార్యఫల సంధానైక విఘ్నంబుగా
బకుఁడెవ్వాఁడగుపడ్డ వాని నిలువం బ్రాణంబులం దీయుటే
బరమార్థంబని యెంచినాఁడ విది సంభావ్యంబొకో పావనం
హర కాంచీపురీ॥ 29

మ॥ పరిపాలించిన వాలినే నయముకూపారంబునంబోసి బోం
పిరి జంపించితివౌర! రాఘవునిచే వేధింపవే నింక ని
న్వరు నింగొల్వరొ వారినెల్ల రిపువైవస్వత్పతీ పాపసం
హార కాట్రేటనిపురీ॥ 30

మ॥ ధరణీపుత్రికవార్త రామునకు సీతాకాంతకుం రామ
వార్త రసాభాసముగల్గకుండ మనసారందెల్పి సంతోషవి
స్తరతాంబోధి మునుంగజేసితివి సీతాంబాప్పగా పాపసం
హార కాట్రేటనిపురీ॥ 31

మ॥ లవదామోదక పారిజాత తరుమూలంబందు సూత్మోనురూ
పసిద్ధై గూర్చొని కోతిచేష్టల ఫలవ్రాతంబులం ద్రెంపుచుం
కసిరాకాసులు సీతకిచ్చు వెతలం గన్గొంచు ఖేదింపవే
యసమానోదయ రామభక్తవర సీతాంబాశ్రితా మారుతీ॥ 32

మ॥ సరిసికేసరి వృత్తి దానవకరీ సంహారముం జూపు సు
స్థిరకేళీవన భంగముం దెలుపు నీసిద్ధ స్వరూపంబు సుం
దరలంకాదహనంబు దెల్పు దమసత్వంబెల్ల నో పాప సం
హార కాట్రేనిపురీ॥ 33

మ॥ గనుగొన్నందగు కోతిరూపివి పడంకం జేయు లోకంబు లె
ల్లను నీసత్వము విన్న రక్కసుల నల్లాడించితో రామదే
వుని కార్యంబది చక్కజేయువరకుం భూరిప్రాభవోపేత వీ
వన కాట్రేనిపురీ॥ 34

మ॥ పరమార్థంబున నర్జునధ్వజము నాపై కాపురంబుండి స
త్కరుణాదృష్టిని జేసి యాతనికి సంగ్రామంబునందుం జయం
బరుదారంగ నొసంగినట్లు కృప నాయుందుంపుమో పాప సం
హార కాట్రేనిపురీ॥ 35

మ॥ భవదామేయ దయాకటాక్షముల నాపై యుంచి నీభక్తరా
క్షీవహంబందున నేనుకండననిగా లేక ముఖ్యుండగా
నవలోకించి యనుగ్రహింపదగు ధైర్యస్థైర్యధుర్యా జయా
హవ కాశ్రేనిపురీ॥ 36

మ॥ శరణో యన్న ననుగ్రహింతువని యాస్తన్వింటి యుష్మద్రస
చ్చరణాబ్జ స్మరణంబె యాదరణతో స్వాంతంబు కందించు నా
భరమే నీయది నీదుసేవ యది నాపాలంటి నోపాపసం
హర కాశ్రేనిపురీ॥ 37

మ॥ అనిలో వానరదానవుల్మడిసె నీవాదైత్యులం సాంతమై
మొనదీ రాయునురెల్ల బోసికొనెదామోదించి వీావారనే
పనిగాయూపిరివోసి లేపితివి సంబంబాన బక్షీకరం
బన కాశ్రేనిపురీ॥ 38

మ॥ ప్రళయంబావిధి రామరావణులు హాహాకారి బోరాడ దా
యలరీతింబోలిపోవు సీకట పనేమైనం గలదే సురా
రులపై యేగితి కత్తిగట్టి బలె నీరోసంబు నిష్కారణం
బల కాట్రేనిపురీ॥ 39

మ॥ ధరణీజాతను జూడబోయి వనమంతం బందగా బీకి ని
ర్జరప్రత్యర్థులరూపుమాపి యనుగారం గాల్చి వారిండ్లు ని
బ్బరమై రావణు దూలనాడ ప్రబలెక్ వైరంబదే పావనం
హార కాట్రేనిపురీ॥ 40

మ॥ భువిరాకాసుడు కంటబడ్డ నతడాభూరంధ్రముం దూరినన్
దివిపైప్రాకిన భీతిజెంది యిక నబ్ధిం డాగిన న్వెంటనే
గి విధిన్వ్యాపిరి దీయకుండుమవె సత్కీర్తుల్ గొనంగా నని
కవి కాట్రేనిపురీ॥ 41

మ॥ విలసత్పాండవమధ్యకేతనముపై వేఁచేసినీవున్న వ
బ్బలమే భీష్మకద్రోణకర్ణముఖదుర్వార ప్రభావోదయుల్
విలయంబందగఁద్రుంచె నర్జునుని దోర్వీర్యత్వమేమున్నదో
యల కాల్రేనిపురీ॥ 42

మ॥ బలవద్రావణ కుంభకర్ణముఖ దుర్వారప్రభావోదయుల్
ప్రళయాగ్నిప్రతిమాను నిన్నదిరి భారంబంది నీరై రికఁ
గలరే ప్రాణముతోడనుండ మరియింకన్వేర రక్షున్నలో
యల కాల్రేనిపురీ॥ 43

మ॥ తరుణార్కుంగబళింపబూనితివి సుత్రామద్విపంబుం
బోరిఁబోరి పైకొంటివిప్రమింగ బుట్టినపుడే బంగారి ప్రౌఢుండవి
త్తరి నెవ్వారలబుట్టపెట్ట విక విద్వద్భూషణా పావనం
హర కాలేనిపురీ॥ 44

మ॥ రణరంగంబున రావణాత్మభవ సామ్రాజ్యంబు నీవేహరిం
చినశూరుండవు నీదుసాహసము వారిశ్శత్రు సైన్యంబు గ
న్గొని భీతిల్లి కడుం జికాకుపడదే ఘూర్ణిల్లరే దుష్టులో
యని కాట్రేనిపురీ॥ 45

మ॥ భవదీయోన్నత శౌర్యధైర్యభుజ సత్వంబెల్ల నీక్షించి యా
త్మ విమర్శించి యొసంగె తారకము నీతంబొప్ప సీతామనో
ధవు డాయుష్యము సుస్థిరంబుగ మహోద్యత్కీర్తి గల్పించె
కవి కాట్రేనిపురీ। 46

మ॥ జననంబైనతరిం తపోధనపతుల్ సర్వామరాధీశ్వరుల్
ఘనతంబల్కిరి యస్త్రశస్త్రముల పాల్గావంచు రాకాసులం
బనిగా నూపిరితీయువాడవని యాపాండిత్యమే యెక్కుడో
యని కాట్రేనిపురీ। 47

మ॥ అనయంబుం జిత్ర గ్రాసవాసముల నింపై పొందు వేళన్మనో
ధనమంచు న్వినుతింతు నిన్ను హనుమంతా కీర్తివంతా శుభా
నన రావే యన రావు ముత్యములు రాల్నా నోటి నేమైననో 48
యన కాంచేనిపురీ॥
మ॥ పనిపాటల్ విడిపించి బిల్తు నిను విశ్వాసంబు లేదేల రా
మునికీర్తింపుచు దీరలేదా కా ఘనమ్ముంజెంద రాకాసులం
బనిగా నూపిరిదీయగా దొరకెనో బల్కంగ లేవే యహో
యని కాంచేనిపురీ॥ 49
మ॥ అలరాకాసులపై హుటాహుటిహటం బై వంటికాల్మీద బ
ర్వ్యలతో పో యసురెల్ల ఘ్రాసికోనుటా పున్నెంబుకన్నన్ మదిం
దలపక భక్తులబ్రోచు సద్యశమమ్ముందంబందగా వచ్చునో 50
యల కాంచేనిపురీ॥

మ॥ తనివిన్ రాముని మంత్రముం గలియుగాంతంబైన దాకన్ జపిం
చినమీదం గద బ్రహ్మవౌదు విపుడే సేవంక రాలాపముల్
వినరాకున్న వె భక్తపోషణము ర్ఖింజేయదే నీకహా
యన కాట్రేనిపురీ॥ 51

మ॥ నరదేవస్తుతమై లసద్యశదమై నానామ మొందాక ను
స్థిరమందాక చిరాయురస్తనుచు నాశీర్వాదముం జేసె భా
సురమై దాశర థీవు ధైర్యనిధివంచు న్పండితా పాపసం
హార కాట్రేనిపురీ॥ 52

మ॥ అలర్థి పర్వతభేది నీవసితనంబందుగ్రుడై వజ్రధా
రలమూర్ఛిల్లగ మొత్తె నీకపుడ గీర్వాణుల్ మునీంద్రుల్ వరం
బులనిచ్చన్ మృతిలేకనుండ సకలాస్త్రఘ్నంతి లేకుండనా
యల కాట్రేనిపురీ॥ 53

మ- మునిమాన్యుండవు దేవపూజితుడవాభూమీసుతానేతకున్
ఘనభక్తుండవు దైత్యసంతతికి ముఖ్యుండైన కాలుండవీ
వనియున్నమ్మిన వారినేల దడవా యాలింపరా వేలనోకున్
యన కాట్రేనిపురీ॥ 54

మ॥ తనివిన్నిష్టుడు బిల్వగావిని సమాధానంబు సంధింపకా
పనిపోజేసి మరేడదుష్టుడనియా భావింతువా రాండ్ర ముం
డను మోపింపగ భక్తపోషణము నేడంబోయె మాటాడకో
యని కాట్రేనిపురీ 55

మ॥ చనువైతోడ్పడి జానకీపతికి రక్షశ్శ్రేణీ దున్మాడి మే
లనకీర్తిం జయలక్ష్మిదెచ్చి కురురాజాధీశులం ద్రుంచి పా
ర్థుని పెక్కంబుననిల్పి కీర్తిజయపాత్రుం జేసితౌ నా యహో
యన కాట్రేనిపురీ॥ 56

మ॥ అనఘాయాప్రతిమానరూపుడవు దుష్టాగ్రేసరాళిన్మదం
బునురుందీసి దయావలోకనవిధిన్ యోచించి భక్తాళికిన్
వెసనిష్టార్థ జయలక్ష్మినిచ్చుట మహద్వీరాను వీరాంక భో
యసమానోదయ రామభక్తిపర సీతాంబాశ్రితా మారుతీ॥ 57

మ॥ బలశౌర్యోన్నతి నెంతవారినయినం బ్రహ్మాస్త్రమాలాడగా
బాలియంజేయు తదస్త్రరాజము జయంబుంగూర్చు నీవెట్టిది
వ్యాలసద్రూపుడవో వితాకుపడజేయంజాల దావజ్రమో
యల కాట్రేనిపురీ॥ 58

మ॥ బళిరా యెంతటి ధైర్యశాలివృగదా బల్ శూరులా యోధకుల్
గల లంకాపురికేగి యొక్కడవె ధాకల్ జేసి నిర్భీతితో
కలశంజేసి పురంబునల్లడల చక్కంజేయవే కార్యమో
యల కాట్రేనిపురీ॥ 59

మ॥ తరిగా వాలము పెంచి ధాటిగ గదాదండంబు కేల్బట్టి దు
ర్భరసంగ్రామమునందు నిల్చినయెడన్ భావింపనీతోడ వా
హరుడైనన్ హరియైన గెల్వగలరే యార్భాటమై పాపసం
హార కాట్రేనిపురీ॥ 60

మ॥ పరమామోదముతోడ నీదు నిజరూపం బాత్మసంతుష్టిగా
గరముం జూడగగల్గు నెప్పుడని లక్ష్యంబుంచి ప్రార్థింతు నీ
కరుణాస్ఫార మదేమొ నాయెడకు రాక న్మాను నోపాపసం
హార కాట్రేనిపురీ॥ 61

మ॥ బలిమి న్నిన్ను గనంగ పాతకులు గుంభధ్యానమున్ జేయుచుం
బిలువంగం బరువెత్తవే యచటికి న్స్థితిల్లియోగాక వా
రల ప్రాణాల్దదముట్టలాగుటకొ ధైర్యంబేదియోగల్గ నీ
కల కాట్రేనిపురీ॥ 62

మ॥ కపినాథాయ సుధీమతే హనుమతే కామానురూపాయ ధై
ర్యపరేశాయ నమోనమోయనిన మాటాడంగ రావైతి నీ
కృపకే పాత్రుడనంటి సందియము నీహృద్వీధిలోనున్న నా
యపరాధంబు సహింపగాదగును సీతాంబాశ్రితా మారుతీ॥ 63

మ॥ అడవిం దమ్ముడుసూడ ద్వాపరయుగంబందెట్లో యుత్సాహివై
కడునింపొందెదు నీదురూపమును చక్కంజూపి మోదాంబుధిం
బడగల్పించినవాడ విప్పుడు దయాభావంబురాదేల నా
యడ కాత్రేనిపురీ॥ 64

మ॥ మునుపే రూపముతోడగూడుక మహాంభోరాజముం దాటితో
మొనగాండ్లైబలులైన రక్కసులతో బోరాడునాడెట్టిదో
ఘనతంజెందిన తత్శరీరమును వేడ్కంజూపుమా నా కేహరా
యన కాత్రేనిపురీ॥ 65

మ॥ సరిగా రాముడు సూరిపోసె నుపదేశంబేమొ నీవాయశ
స్కరుకుందప్పు సహాయమేరికొ సగంగాబూన వీభక్తు లం
దరి కీరీతిగ తృప్తిసేతువు సమస్తంబీవెగా పాపసం
హార కాంచీపురీ॥ 66

మ॥ ధరణీజాహరిణేశ నీకు సుకృతార్థత్వంబు గల్పించి యా
దరణన్ భక్తుల కండనుండుమని వాగ్దానంబు తత్సక్తియున్
సరసంబంచు నొసంగె బ్రోవదగునో సాధుప్రభో పాపసం
హార కాంచీపురీ॥ 67

మ॥ ఫలితార్థప్రతిపాద కోన్నత లసద్బ్రహ్మాధిపత్యంబుపై
గలయాశందగ దోస్సహాయముడి రంగత్సంగరంబందుని
శ్చలతన్ చాకిరి జేసినాడవు రఘుస్వామి నేతకున్ముఖ్యమో
యల కాంచీపురీ॥ 68

మ॥ బలవత్పర్వతముల్ శిలాగనువతుల్ పాటింపమున్నీటిపై
బలే తేలాడగ జేసి చేసితివి ద్రోవ న్వార్ధి నవ్వానరుల్
సుళువై దాటువిధంబికేమిఁకని బల్ శోధింపవే నీవహో
యలకాప్రేనిపురీ లసత్సదన సీతాంబాశ్రితా మారుతీ॥ 69

మ॥ స్థిరమై సాహసధైర్యముల్ గాని ప్రసిద్ధింగల్గు కార్యాళి ని
స్తరతం జేసితి వబ్బురంబుపడ తత్సామర్థ్య మారాముడా
దరణాన్నికు మెసంగ లేనియెడ నాదాస్యంబు నీకేల త
చ్ఛరణం బే శరణంచు నుండుమువె సీతాంబాశ్రితా మారుతీ॥ 70

మ॥ అలనాడా రఘునేత ద్వాపరమునందా కృష్ణు డుద్వీర్యదో
ర్బలముల్ నీకు నొసంగ రక్కసుల సత్వప్రౌఢులా ధార్తరా
ష్ట్రుల నల్లాడగ నుగ్గుజేసితివి యేరుం బొందరానట్టి నీ
కలువై నద్యశమీవిధిన్వెలిగ సీతాంబాశ్రితా మారుతీ॥ 71

మ॥ మురిపెంబైదగు నీయదృష్టమిదియేమో రాముడుం గృష్ణుడుం
గరుణాపార కటాక్షవీక్షణ సలక్ష్యప్రజ్ఞ నీకేయొసం
గిరి బ్రహ్మాధిపతిత్వమందుటకు భక్తిప్రసిద్ధమై యుంటివో
యరవిందాసనగేయ బ్రోవుమను సీతాంబాశ్రితా మారుతీ॥ 72

మ॥ తలక్రిందై తపమెన్నియేండ్లు మునులాస్తం జేసిన న్వారికా
జలజాతాసనలోక మీక్షణతకే సాధ్యంబుగా దట్టి ను
స్థల మీవేళ గనేగుచుంటివి మహాత్మా నీయదృష్టంబుకే
నలతి న్మ్రొక్కెద నుద్ధరింపదగు సీతాంబాశ్రితా మారుతీ॥ 73

మ॥ సరసద్భానుర సద్విహార విలసత్సర్వామరార్చద్భవ
చ్చరణమ్మే శరణమ్ముగా నిరతమాశాపాశముల్ వెంచినే
స్మరణాం జేయుచునుంటి నింపు కరుణాసారం బహోపాపసం
హారకా క్షేత్రనిపురీ॥ 74

మ॥ అనవద్యన్మునిసాధ్యహృద్య పరవిద్యారూప శ్రీరామపా
వన మంత్రస్మరణ ప్రసక్తి నను కాపాడంగరా నిదె యీ
వని యే నమ్మినవాడ భారమనిగా భావింపకే రమ్మహా
యన కాంచీనిపురీ॥ 75

మ॥ బరువా నా పరిపాలనంబు తరిగా పాటింపగా ముఖ్య మీ
తరుణం బావిధి గాక నాకభయహస్తంబీగరాదా సరే
కరుణాధారుడనై తినన్ను ముదముం గన్గొందు వో పాప సం
హార కాంచీనిపురీ॥ 76

మ॥ తనివిందీరగ నిర్జరాహితుల చిత్తంబందు లేశంబు ప్రే
మను సంధింపక పుట్టపెట్టితివి నీబాహుప్రభావంబు గ
ల్లని లోకంబులు నిండి పొంగి బొరలన్ హార్యక్షమాంకా యహా
యన కాంచీనిపురీ॥ 77

మ॥ తరులందో గిరులందొ రాముని మనస్థానంబునందుంచి దు
ర్భరతారణ్యమునందు నెచ్చటనొ ఘోరంబౌ తపోనిష్ఠ ను
స్థిరమై యుంటివొ లేక నామొరవినేదేలేదొకో పావనం
హర కాశ్రేనిపురీ ॥ 78

మ॥ నిరతమ్మున్నిను గన్నతండ్రి వనిగా సీతమ్మతో లోకముల్
దిరుగు న్మాదృశు లాచరించు మొరలెంతే నీకు విన్పింపడో
శరణత్రాణ పరాయణత్వమది నిమ్మన్నేదొకో పావనం
హరకాశ్రేనిపురీ॥ 79

మ॥ తగు ప్రేమంబున సర్వభూతముల నంతర్యామివై గాచుచుం
డగ సీతండ్రి భజించు మాదృశులకుం దాపై దయాదృష్టి నిం
పుగ బోషింపవదేల నీకిది ఘనంబుంగాదె రావేల డా
యగ కాశ్రేనిపురీ॥ 80

మ॥ శరణత్రాణ పరాయణత్వమది నీసత్వ ప్రధానత్వమై
జరుగుంగానల సద్భవచ్చరణ దాస్యధ్యానతోనున్న నా
ఘరమెంతే మరువంగబోకుము కృపాభావప్రభో పాపసం
హార కాట్రేనిపురీ॥ 81

మ॥ ఇక నీవావరమేష్ఠివై మునిజనాహీన స్తవంబై శుభ
ప్రకటంబై తగు గద్దెపైన నెలవై పాలించు నావేళ న
న్నొక కంటాగనిపెట్టి యుచ్చదశ నిన్నుత్సాహివై ముఖ్యమై
యకలంకానుపమాన ధైర్యధరసీతాం॥ 82

మ॥ జననంబియ్యది మారి వేరొకటి యాసన్నంబుగా నప్పునిం
పునరుచ్చస్థితిగాగ ప్రాయుము ఘనంబుం జెందనిన్నిప్పుడే
వినుతింజేసెద సృష్టికర్తవిక నీవే ముందుగాబోదువో
యని కాట్రేనిపురీ॥ 83

మ॥ హరదైత్యారి పురందరాద్యమరలోకాలోకలోకోన్నత
స్ఫురతిన్స్వర్గెదు సత్యలోకమది; నీపుణ్యస్వమేమోగదా
దొరకున్ పైనప్రభుండ వీవ మరుదందుంగల్గ దైనన్ సుహృ
ద్య రతిన్వేడెదనీ దయోన్నతికి సీ॥ 84
మ॥ తపముంజేయుచు వింధ్యపర్వతముపై ధర్మిష్ఠివైయుంటివం
చు పరోక్షంబుననంటి సన్నిహితమైజూడంగ రావైతి యు
చ్ఛపదంబుంగొని లోతలంపవని నాసందేహ మింకైన నా
యపరాధంబు సహింపగాదగును సీ॥ 85
మ॥ అసహాయోన్నత శౌర్యధైర్య బలయుక్తాఢ్యుండ వత్యంతహృ
ద్యసుధీనేతవు దైవశక్తియుత ప్రౌఢ్యభ్యాసమానుండ వీ
వు సమస్తంబునెరింగి భక్తులకుదాపుంజేయరాదేలనో
యసమానోదయ శౌర్యధైర్యధర సీ॥

మ॥ సరసంబైన భవచ్చరిత్ర విన నాశ్చర్యంబుసంధిల్లు ను
స్థిరయుష్మత్పర మొల్లసచ్చరణ మొం తేగూర్పగా నాత్మలో
నరయంగా జొరవెట్ట వింతకఠినం బామోదమే పావనం
హర కాంక్షేనిపురీ॥ 87

మ॥ పరమామోదముతోడ రామభజనస్వామ్మోడ విస్తారమై
వరిపాటిల్లును వత్తువీవచటికిన్ భావింపగానంచు నెం
దరొవాదింతురు తద్విధంబునకు నీతంబేదిరో పావనం
హరకాంక్షేనిపురీ॥ 88

మ॥ నవనంబుల్ శతమాచరింప సురరాజత్వంబుచేకూరు క
ష్టవిధానన్ బహువేలయేండ్లు తపముల్ సాధించినన్ బ్రాహ్మ
త్వవిభుత్వంబది యత్నమంబున జయంబుదంగచేకొంటివ
య్య విభో దైవనుతోల్లసచ్చరణ సీ॥ 89

మ॥ అరుదారంగవిభీషణుండు మునుదానత్యంత మెన్నోలస
త్పరదంభుల్ తపమాచరింపగ రఘూత్తమ్మా నేత యవ్వానికిన్
సుర రాజత్వము కల్పనంతరముతో శోభిల్లగా జేసెనీ
వరుగంబోయెడు దానినిచ్చెనొకో సీ॥ 90

మ॥ తనివిందీరగ నీయదృష్టమిది నీతంబొప్పగా సత్తపో
ఘనకష్టంబులు లేకనే యజునిలోకం జేలగా నిచ్చె నీ
కనువయ్యెన్ రఘురామమూర్తిదయ దివ్యత్తేజసర్వాఘసం
హాన కాంచీపురీలసత్సదన॥ 91

మ॥ ప్రియముంగైకొని నాతరంబు కడతేరిందాక హృద్యద్ధయో
దయ ముక్తిశ్రీజయ సంపదల్ బొదల మిథ్యావాదివింగాక బ్రా
పయిసంరక్షణ సేయుమీ నను నమాందానందకల్యాణ దా
య యశోయోషిదలంకృతానుగుణ సీ॥ 92

మ॥ అనవద్యాండగు సృష్టికర్తనగుదేనంచు న్మహోల్లాసమున్
గున దేలాడెద నర్చనార్హత కహో దూరంబె యెవ్వారలై
నను పూజింపగవింటిమే హరిహరన్యాయంబుగా వాక్పతీ
యని కాట్రేనిపురీ॥ 93

మ॥ ఘనమైనమ్మిన వారి సమ్మతిపడంగా జేసి పైవారి కిం
పునుబుట్టింపుచు సద్యశోన్నతికి బ్రాపుగన్న నాపైన వృ
ద్ధిని పొందించు మహాధిపత్యమునకాదె నంతరాయం బహో
యన కాట్రేనిపురీ॥ 94

మ॥ హనుమంచు న్వరమిచ్చియేగె రఘురామస్వామి వైకుంఠపా
వనసంస్థానముకంత నర్జునుని బ్రాపాటదే వేరను
క్కనిపాలించెనటంచు జాడనెరుగం గాపాడవే నన్నహో
యన కాట్రేనిపురీ॥ 95

మ॥ బలుమారుల్ బలుకంగనేల నికనాభారంబునీదే భవ
త్ఫలసామ్రాజ్య శుభప్రదాన భజనాభారంబు నాపాలిదే
జలజాతాప్తసుధాకరుల్ మనకు సాక్ష్యంబిందు కొప్పందగున్ 96
యలకాప్రేటనిపురీ।
మ॥ అలరాకాసుల గుంపులీపుడమి మాయంబైరి భీతిల్లి బ
ల్మి లయాకారుడవంచు చావుపుటకల్లేకుందువంచున్ భవ
ద్బలవద్బాహుసమర్థతాపటిమ చప్పన్నకయ్యమా నేనుఁదీ 97
యల కాప్రేటనిపురీ
మ॥ బలవత్సంగరధీర సద్గుణమణీ ప్రఖ్యాతచారిత్ర రా
మల సత్పాదసరోరుహాంఘ్రిజనసామ్రాజ్యప్రభోభక్తవ
త్సల వేకరుణింపవే తడవికంజాలించి రక్షింపుమో 98
యల కాప్రేటనిపురీ॥

మ॥ భవదీయానుప మానశక్తియె వివస్వత్పుత్రు తద్వానరా
జ్యవసామ్రాజ్యము నందునిల్పె ఘనలంకామేయ రాజ్యైకవై
భవమొందుంచె గదా విభీషణుని సంబ్రంబా సమర్థింపనీ
కవికాత్రేనిపురీ॥ 99

మ॥ కనగా నైజలసత్ప్రభావము రఘుత్మ్మనేత పొందింపజే
సిన తేజోవిధమా భవత్కృతజయశ్రీ భూరికార్యంబులె
ల్లను చిత్రంబగువిన్న నిర్జరులకే లక్ష్యంబుగానొప్పు హా 10
యన కాత్రేనిపురీ॥

మ॥ భగవంతుండని రామచంద్రునకు నాపత్కాలమే తేదినం
దగతోడైయొనరించినట్టి భవదుద్యత్కృత్తి కృత్యంబు ము
జ్జగముల్ ముక్కులవ్రేళ్ళుబెట్టి మహదాశ్చర్యంబు నందెంగదా
నగరాడ్ధీరుడ వౌర శౌర్యధరసీతాంబాశ్రితా మారుతీ॥ 105

ఇది
శ్రీ శతావధాని భారతుల వీరరాఘవశాస్త్రి
విరచిత హనుమత్శతకము.

ఓం తత్సత్

---